శ్రీరస్తు

# శ్రీ ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

ఇది,

శ్రీ మదరాసు గవర్నమెంటు సాల్టు యుద్యోగస్థుడును

శ్రీ విజయనగర పురి వాస్తవ్యుడును

అగు

## కుప్పిలి కృష్ణమూర్తి

కవిచే,

రచియింపఁబడినది.


FIRST EDITION, 1000 COPIES

PRINTED AT "SRI SEETARAMA VILAS PRESS

**ICHCHHAPURAM.**

**1910**

# పీఠిక.

ఆర్యవర్యులారా!

నేను చిరకాలమునుంచి యేతద్గ్రంథమును రచియింపవ ద్దేశించి యిటీవల అట్టి యుద్యమమునకు అస్మదీయకులసంజనితులును, మహాశయులును నగు శ్రీ రావు ఇప్పిలి అప్పల నృసింహ శర్మగారి ప్రోత్సాహ సాహాయ్యంబుగా అనేక గ్రంథములను పరిశీలించి నేనీ గ్రంథమును విరచించితిని. బ్రహ్మశ్రీ మన్నవ బుచ్చయ్య పంతులు, సిద్ధాంతమహత్త్వము, సింహవాజపేయి పండితులు, శ్రీకృష్ణపండితులు, శ్రీమాన్ కాండూరి లక్ష్మణాచార్యులు చే రచియింపఁబడిన గ్రంథములలో శిష్టకరణాన్వయ సాముదాయమునుగూర్చి కొంతవరకు వక్కాణింపఁబడియున్నది, గాని అస్మద్దేశీయులగు శిష్టకరణంబులయొక్క యుత్పత్తి, స్థితి, క్రియాచార వ్యవహారాదిక విశేషములంగూర్చి విపులముగా దెలియపర్పఁబడియుండ పండిత పామర జనాళికిం గూడ దెలియునటుల తేటతెల్లమగు తెనుగు మాటలచే నేనీ గ్రంథమును విరచించితిని. భవిష్యత్పురాణము, పద్మపురాణము, విష్ణుపురాణము, బ్రహ్మాండపురాణము, స్కాందపురాణము, బృహన్నారదీయము, పరాశరస్మృతి, ఉజ్జ్వలము, విప్రవంశము, దశవిధబ్రాహ్మణశాఖాపరము, చరణవ్యూహము, నాడీశాస్త్రము, వేదనారాయణ కథాసుధారసము, అనునీ మొదలగు ప్రామాణిక గ్రంథములను పరిశీలించి తత్తత్సారాంశములంజేర్చి యొక్కచో నీ గ్రంథమును

కూర్చి పురాతనమునుండి యూహించుచున్న నా మనోరథము
ననిర్విఘ్నముగా నెరవేర్చుకొంటిని. గ్రంథరచన కిదియే ప్రప్రథ
మపరిశ్రమంబగుటచే దీనిబఠించెడి సుగుణ గణ గ్రహణైకపరా
యణులగు విద్వాన్ సుహృద్వరులెల్లరిందలి యసంఖ్యాకంబులగు
వ్యాకరణాది దోషపుంజంబుల మన్నించి అట్టివాని దెల్పెదరని
ఈ రెండవకూర్పున సవరించెదను.

చ॥ వెలయగ నస్మదీయ కులప్రసూత గ్రంథము చెప్పనెంచు కు
ప్పిలికుల పావనుండు సువివేకి యశోధనుఁ డార్య వర్యుఁ డ
ప్పల నరసింహశర్మ సగబల్కెను బూరికిఁ గొన్ని పుస్తకం
బులు బరికించి చేసితిని మోదమున న్మతి దీని నెంచగాన్॥

కం॥ ఒప్పుగ బెంచిన కీరము।
తప్పులు బల్కినను విని ముదంబందుగతిన్।
తప్పులు నీకృతిఁ గల్గిన।
నొప్పులుగాగొన నుతింతునో బుధులారా॥

కం॥ వినయనిధి రంగయాఖ్యుని।
తనయుండన్ విజయనగర ధాముఁడ ద్విజుఁడన్।
ఘనమగు నేతగ్గ్రంథం।
బును జేసితి కుప్పిలి కృష్ణమూర్త్యాహ్వయుఁడన్।

ఇట్లు,
ఆస్తిక జన మిత్రుఁడు
*Kuppili Krishnamurti,*
AUTHOR.

[illegible]పురము,
30—6—1910

శ్రీ

# ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

## ప్రథమాధ్యాయము.

---

శ్లో॥ గణాధిపం విఘ్నగణావమర్దనం ।
నమ స్తదేవాగ్ర నరైశ్చ పూజనం ।
స్వార్థ క్త కల్పద్రుమ మల్పచేతనై ।
రగమ్యరూపం ప్రణతో స్మి సర్వదా ।

ఉ॥ శ్రీ వెలయం జగంబులకు
 జెల్వొనరించు శశాంకునిన్ దలన్
శివి దొలర్పదాలిచి న
 టించిన యజ్ఞవరారి వేలు తన్
జ్ఞానపథవారి పెంజడను
 జావాలబట్టి యూర్పులలు లాగుచున్
క్రేవల కారు విఘ్నపతిశిన్
 ఖ్యాతింతు నిశాంతు [illegible]





ఉ॥ కుందతుషార హీరశశి
కోట్యహిరాజ గిరీశ కాశ పూ।
ర్ణేందువియన్నదీకలశ
నీరధి కల్పతరు ప్రకాశకృతీ।
కందళితారవింద భవ
కల్పిత మోహిని ధాత్రిగేహినీ।
వందన మేనొనర్చెద వా
ణి పురాణికృపా ప్రపూరణీ॥

జగదాధారునకు సమర్పితంబుగా నేరచియింపంబూనిన ఉత్కల విప్రవంశ ప్రదీపిక యనునీ మహా గ్రంథంబునకుం గథాక్రమంబెట్టులనిన !

విప్రవంశ శాఖా వివరము.

శ్లో॥ మహారాష్ట్రాంధ్ర ద్రవిడాః
కర్ణాటచ్చైవ ఘూర్జరాః॥
ద్రావిడాః పంచధా ప్రోక్తా
వింధ్య దక్షిణ వాసినః
సారస్వతాః కాన్యకుబ్జా
గౌడా ఉత్కల మైథిలాః॥
గౌడా పంచ విధాః ప్రోక్త
వింధ్యా దుత్తరవాసినః ! (విప్ర వంశమూ)

తే॥ గీ॥ బ్రాహ్మణులు రెండువిధముల బరగుచుందు।
రవని ద్రావిడులని గౌడులనియు వరున।
వీరు నివసించియుందురు వింధ్యగిరికి।
కుశలులై దక్షిణోత్తర దిశలయందు॥

పంచద్రావిడ బ్రాహ్మణులు వింధ్యకు దక్షిణ దేశమునను, పంచగౌడ బ్రాహ్మణులు వింధ్య కుత్తర దేశమునను నివసింతు రు, వీరు వేద వేత్తులై పరమ పవిత్రింబగు వృత్తులంబరగి షట్కర్మ నిరతులై వరలుచుందురు.

## పంచద్రావిడ బ్రాహ్మణులు.

1. మహారాష్ట్రులు. 2. ఆంధ్రులు. 3. ద్రవిడులు. 4. కర్ణాటకులు 5. ఘూర్జరులు.

## పంచ గౌడ బ్రాహ్మణులు.

1 గౌడులు. 2. మైథిలులు. 3. ఉత్కలులు. 4. సారస్వతులు 5. కన్యాకుబ్జులు.

ఈదశవిధ బ్రాహ్మణులలో కూడా పెక్కుసుపశాఖలు గలవు. అట్టి సుపశాఖలనిదివరకే "విప్రవంశము." "దశవిధ బ్రాహ్మణ శాఖా వివరము" అను గ్రంథములలో విశదముగా వ్రా

ణింపబడి యుండుటచే నయ్యాదియ్యాద గ్రంథవి స్తర భీతిచే వివరిం పలేదు అందు శాఖాభేదములయొక్క నుత్పత్తికారణములు వ ర్ణించక పోవుటచే నిప్పుడు పంచగౌడులలోని నుత్కళబ్రా హ్మణ శాఖలనుగూర్చి కొంతవివరించెదం.

## ఉత్కళ బ్రాహ్మణోప శాఖావివరము.

ఉ॥ శాశని ఘాటియాకొటికి
సాంతో యు శ్రోత్రియ భాద్రిసాహు పం।
డా శతప స్తిశిష్టకర
ణాఖ్యులు నుత్కళ దేశవిప్రులై।
దేశవిదేశముల్ దిరుగు
దిట్టరులాటను దెల్పనోదు వా।
తాశను ద్రైనవారి విపి
ధాంతర శాఖలపెక్కు వర్తనల్॥ (విప్రవంశము)

క॥ హలధరులు మరియుబూజా।
రులునైవర్తించు ద్విజవరులకు మహాస్తా।
నులు హలాళువా పాండాలని।
పిలుతురు వాడుకగ మూడు పేరులచేతన్॥

కావునని దశవిధనువశాఖలలో పెక్కుశాఖలుకలవు. అందు

పండాలలో

(1) మహాస్త్రానులు. (2) పూజారులు. (3) పాణిగ్రాహివాలు
(4) సారువాలు (5) దానవాలు.

2 కరణాలలో (1) శిష్టకరణాలు (2) శిష్టకాయస్థులు. (3) అంబష్టులు. 4. సూతకాయస్థులు. (5) వైశ్య కాయస్థులు. అని దశవిధములు.

గీ॥ గౌడ విప్రులగుచు ఘనరాచకార్య ని
ర్వాహకత్వనిపుణ వైభవమున।
శిష్టులైచరింప శిష్ట కరణములని।
వాడుచుందు రఖిలవసుధ జనులు॥

కావున శిష్టకరణములను గౌడ విప్రులుత్కల దేశమునుండి లోకి కాదిరాచకార్యములపై నీకళింగ దేశమునకే తెంచి వారి వారి కులాచారములను విడువక సంచరించెదరు.

ఉ॥ శ్రీయుతలౌక్య వర్తనులు
శిష్టగుణుల్ క్రతుసద్ద్విజాధిపా।
మేయఘనాపరాభిమల
మిత్ర విషాదన కాళియుక్త భూ।
నాయకమాన్య శిష్టకర
ణాఖ్యులు వీరల జాతపద్మ వా।

త్రాయతనేత్రజన్యులును
తత్కరణాఖ్యను దాల్తురెంతయున్॥ (విప్ర)

టీక॥ శ్రీయుత-శోభాయుక్తమైన, శౌర్యరత్నులు-శౌర్య ప్రకటన కలవారును, శిష్టగుణుల్-శ్రేష్ఠమైన గుణములుగలవారును, క్రతు సద్గ్రీహాధి పామేయఘనా పరాభిదులు అనగా క్రతుసద్గ్రీహాధిపా=యజ్ఞ [illegible] కాధి కారులచేత, అమేయ-తక్కువ కానట్టిన్ని, ఘన-గొప్పదైన [illegible] అపరా భిదులు=ఇతర నామములను వహించిన వారలును, అమిత్ర-శ[illegible] దనతా-మర్దించుటయందు, అభియుక్త=పేరుపొంది, ధూ[illegible] ధిపులచేత, మాన్య-మన్నింపబడిన, శిష్ట[illegible]ఖ్యులు-శిష్టక[illegible] లవారును, అజాత పద్మప త్రాయత నేత్రజను[illegible] అనగా - అ-వి[illegible] కు నాభికమలమందు, (అజాత్ బ్రహ్మా[illegible]) ఇతి నానార్థ[illegible] జాత-పుట్టిన బ్రహ్మయొక్క, పద్మపత్ర-తామర పద్మము వంటి, ఆయత=విశాలమైన, నేత్ర=కన్నులయందరి తేజమువలన, జన్యులు=పుట్టబడిన వారలును, వీరలు=ఈ లక్షణములుగల శిష్టకరణములు, తత్ కరణాఖ్యను తత్=అయొక్క, కరణాఖ్యను=శిష్టకరణమనే నామమును, ఎంతయున్=విశేషముగా, దాల్తురు=వహింతురు.

గీ॥ శిష్టకరణాభిధానులై ప్రాపులగుచు
నిలిచినృపతుల దయచేత నివ్వటిల్లి।
నీతిశాస్త్రి ప్రవీణులై నియమమొనగ।
భవ్యులైయుందురుద్యోగపటిమఁగలిగి॥ "వేదనారాయణ"

శ్లో॥ కన్యప్రజాపతే రాయే లాభేయస్మాత్ ప్రవర్తిత॥
తస్మాత్కాయ స్థమిత్యా హుశ్చిత్రగుప్తంచ సూరయః॥

చిత్రేణరక్షితత్వాంచ చిత్రగుప్త మథోవిదుః।
యమస్యకరణం సోయంవదంతి తన్మహాషిణాం।
భూమిస్త్రప్రాణినాం పాపపుణ్యాలేఖాధి కారణం।
స్థితంసంయమనీ పూర్వ్యం చిత్రగుప్తం పరివర్తితః॥

ప్రజాపతియొక్క ఆయవ్యయ కార్యములయందొక దేవర్షి పరివర్తించుటచే నాతడు కాయస్థుడాయెను. ఆశ్చర్యకరమగుస కలరక్షణ చిత్రప్రచారుడగుటచే వానినే పండితులు చిత్రగుప్తు డందురు. భూలోకములోని ప్రాణికోట్లయొక్క పాపపుణ్యాము లను సంయమనీ పురంబున వ్రాయుటగుర్తిగి యుండుటచే మ హాఋషులు వానినే కరణమని నుడినెదరు.

శ్లో॥ ఋషీణాం చిత్రగుప్తస్యకాయే స్థిత్యయతో భవేత్।
తతఃశ్రేష్ట భవత్పూర్వం
కాయస్థబ్రాహ్మజాతికః॥
కన్యప్రజాపతేరాయే
లాభేయస్మాత్పరివర్తితః॥
తస్మాత్ కాయస్థమిత్యా
హుచ్చిత్రగుప్తంచ సూరయః॥ (కూర్మపురాణము)

ఋషులలో ఒకడైన చిత్రగుప్తఋషి నకాయులయొక్క పా పపుణ్య వివేచనచేయుటచే కాయస్థుడాయెను. తాను బ్రహ్మజా

తిలో శ్రేష్ఠుడగుటచే శిష్టకరణమాయెను. బ్రహ్మయొక్క అయ
వ్యయములయందు పరివర్తించుటచే దేవఋషియైన చిత్రగు
ప్తుడు కాయస్థుడాయెను. కూర్మపురాణములో శిష్టకరణములు
బ్రాహ్మణులని ప్రమాణము కలదు. పరాశర స్మృతిలో నీజా
తి బ్రహ్మతేజస్సుననుండి నుద్భవించి, చిత్రగుప్త వంశస్థులై, దేవ
తాంశమువలన బ్రాహ్మణులని చెప్పబడినది. ప్రజాపతి నీచిత్ర
గుప్తఋషిని సృష్టి చిత్రంబులు వ్రాయుటకుగాను నియమించి,
చిత్రగుప్తకాయస్థుడని పేరునిడెను. అంత భూలోకములోనట్టి
చిత్రవిచిత్రములైన లౌకిక వృత్తులకుగాను ఆకమలగర్భుండు తన
నేత్ర దృష్టినుండి సృష్ట్యర్హమగు నొక తేజస్సునుదీసి లేఖణగణ
నావ్యర్హమగు చిత్రగుప్తుని తేజస్సుతో చేర్చి భగవద్ధ్యానాద్యర్హ
పరాశర ఋషి తేజస్సుతో నేకీభవింపచేసి పురుషునొకని సృ
ష్టించెకావున అతడు శిష్టకరణ చిత్రగుప్త కాయస్థుడనబడును.

చ॥ అటదగు చిత్రగుప్తులని
          జాంశముదాల్చి వాణి పాణులన్
పటువహనార్హమైతను మా
          వర్వ్య కిరీటమునిచ్చువిచ్చటో॥
ద్భటమది వెల్గుబ్రహ్మముఖ
          పద్మజునందు విలాసమొప్ప నం॥
కట నుదయించె శిష్టకర
          ణంబుల జాతము పొంపుపెంపునన్॥

టీక॥ అట=ఆస్వర్గలోకమునందు, తగు=ఒప్పిదమైన, చిత్రగుప్తుండు=యముని మంత్రులయొక్క, నిజాంశము దాలిచి, నిజ=స్వకీయమైన, అంశము=తేజోభాగము, దాలిచి=ధరించి, వాణిపాణులన్=విద్యానాశ్వర్యమున, పటు=స్పష్టముగా, వహన=ధరించుటయందు, ఆర్హమై=తగినట్టి, తను=దేహములుగల, సుపర్వ=దేవతలయొక్క, కిరీట=మకుటములయందుగల, మనిచ్ఛ=విచ్ఛటా, మణి=మణులయొక్క, ఛవిచ్ఛటా=కాంతిఘటలుచేత, ఉద్భటరుచివెల్గు=ఎక్కువైనప్రకాశముచేత నెఱిల్లిన, బ్రహ్మముఖ పద్మమునందు=ప్రజాపతియొక్క ముఖపద్మమునందు, విలాసమొప్పన్=ఉల్లాసమొప్పునట్లు, అందు=ఆముఖమునందు, అటన్=ఆవిలాసాన్వితమైనస్థలమునందు, సొంపు పెంపునన్=సౌందర్యవిశేషముచేత, శిష్టకరణంబులజాతము=శిష్టకరణులసమూహము, ఉదయించెన్=జననమయ్యెను.

శ్లో॥ కాయస్థః శిష్టకరణాః బ్రాహ్మణా నైవసంశయః।
సదాచారజనం హిత్వా రాజన్యాః మన్త్రిణస్థితాః॥

శిష్టకరణములుత్తమ ప్రవర్తనులై సద్బ్రాహ్మణులగుటచే వీరిని దేశాధిపులు మంత్రులనుగా నిడుకొనిరి.

శ్లో॥ ఋషీనాం చిత్రగుప్తస్య కాయే స్థిత్యయుతో భవేత్।
తస్మాత్ కాయస్థయిత్యే తన్నామలోకే ప్రతిష్ఠితః॥
కరణం క్షేత్రమేతేషాం శిష్టం యస్మాత్ప్రకీర్తితం।
తతస్తే శిష్టకరణలోకేఖ్యాతిః ప్రతిష్ఠితాః॥

చిత్రగుప్తఋషియొక్క శరీర సంబంధుడగుటచే కాయస్థుడనియు, నింద్రియాంతః కరణములను శిష్టవర్తనకు దెచ్చుటచే శిష్టకరణమనియు లోకులందురు.

క॥ నరపతి హారిపతి గజపతి।
వరకాంత్యు సురంధర పరినర్తకులై నీ।
ధరణిం బ్రసిద్ధి గాంచిన।
కరణంబులలోన శిష్టకరణకులజులున్॥ (నలచరిత్రము)

ఇట్లు చెప్పబడి యున్నదిగాన నీకరణములలో శిష్ట కరణంబులు కళింగ దేశ గజపతుల రాష్ట్రములలోనుండి మంత్రాంగము లు మొదలు గ్రామోద్యోగ ప్రవృత్తులలోనం బ్రవర్తింపు చుండును.

ఇతర కరణ శాఖా వివరము.

శ్లో॥ పూర్వాం మారుతకన్యాం
వై కాయస్థః పరిణీతవాన్స్వయం।
తస్యతస్యాంతుయః పుత్రః
శిష్టకాయస్థ సంజ్ఞకః॥ (భవిష్యపురాణము)

ప్రథమత దేవతాంశ శ్రీయుత మారుతకన్యను కాయస్థుడు వివాహము చేసుకోగా నాకన్య గర్భమందుద్భవించిన యతడు శిష్టకాయస్థుడాయెను.

శ్లో॥ పునః సంతతిరతూనైౖ గృహీతాయాం పృథక్పృథక్।
మహీపాంబష్ట సూతానాం కన్యాకాస్తుసుశోభనాః।
తాసూత్త నాస్తుయే పుత్రాః కాయస్థస్య మహాత్మనః।

కేమాత్ర సంజ్ఞ ప్రథితాః సూతాఖ్యభిన్న జాతికాః॥

ఇతి భవిష్యపురాణ వచనప్రమాణేన రాజకన్యామహిష్యాం బష్టసూతభ్యో మహిష్యాంబష్ట సూతనామానః పుత్రశ్చైవ ప్రైనః॥

పిమ్మట యీ దేవాంశ కాయస్థులైన ముగ్గురుపుత్రులు రాచకన్నియలను బరిణయమైరి. వారివలన నుద్భవించిన పుత్రులకు యిల్లులనుబట్టి అంబష్టుడు, మాహిష్యుడు, సూతుడనునామంబులు వచ్చెనని భవిష్య పురాణములో చెప్పబడియె కావున నీముగ్గురి సంతతి వేరువంశంబులాయె.

గీ॥ పరగ ముఖ్ధాన షికుళలంబష్టులును ని
షాదులను వారురాజ వైశ్యసతులందు
బరగ శూద్రవనితయందు వరుస విప్ర
కులజానకు గల్గినట్టి వారలుదలంపా॥

వీరలు అంబష్ట కరణములు

గీ॥ క్షత్రియునకు వైశ్యజాతివానిక విప్ర
కులను వనితవలన గలిగినట్టి
వారువరున సూతవైదేహకులనంగ
దెలియబడుదు రవని జలజనాభా॥

వీరలు సూత కాయస్థులు

గీ॥ క్షత్రియునకు వైశ్యసతియందు మరిశూద్ర
కన్యయందు వరుసగల్గినట్టి
మనుజులెన్నబడు కరణఘ మహిష్యోగ్ర
జాతులనగ ధర్మశాస్త్రములను॥ (స్మృతిసారం.)

**వీరలు (వైశ్య) మాహిష్యకాయస్థులు.**

వీరలలో సూతకాయస్థులుత్తర దేశమునందును, అంబష్ట కాయస్థులు పశ్చిమ ప్రాంతములందును, మాహిష్య కాయస్థులు దక్షిణ దేశమునందును, శిష్టకాయస్థులు బంగాళమునందును, శిష్టకరణములు పూర్వదేశము నందును నివసించి యుందురని పద్మపురాణములో చెప్పబడియె.

కాయస్థ సంజ్ఞిక కరణజాతీయ వ్యవస్థా ప్రాపవవ్యగ్రధీరవ్యల్కగణాఖ్యాం సమాగత్యానాం శూద్రవైశ్యాది జాతినాం వణిక్కరణానాం పృథక్త్వం సపరిమాణేనరభతే॥ (భవిష్యపురాణము)

శూద్రస్త్రీకిని వైశ్యపురుషునికిన్ని పుట్టినవారలు వణిక్కరణములని పిలువంబడి వ్యాపారవృత్తులతో వైశ్యకరణములనబడుదురు. ఈ శాఖవారు వారలు నివసించియుండు దేశములననుసరించి సుబ్బాయికరణములు, కరకపిళ్ళలు, మాగధకరణములు, శ్రీనివాసకరణములు, విదేహకరణములను నామంబులతో మునద్ది వృత్తులందు చెలగుచుందురు.

శ్లో॥ శూద్రావిశస్తు కరణాంబష్ఠ వైశ్యాద్విజన్మనః।
ఇత్యమరః॥

ఈ వైశ్యకరణములే అమరములో కరణశబ్దవాచ్యులై వక్కాణింపబడిరి.

గద్య॥ ఇది శ్రీమద్గోపాల కృష్ణ పరబ్రహ్మ కరుణా కటాక్ష
లబ్ధ విద్యావైభవ కాత్యాయని సూత్ర యాజ్ఞవల్క్య
గోత్రగాఢ బ్రాహ్మణ శిష్టకరణ వంశోద్భవ కుప్పిలి
రంగయాఖ్య చతుర్థతనయ నయగుణ విధేయ
కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన
శ్రీమదుత్కళ విప్రవంశ ప్రదీపిక
యను గ్రంథంబునందు
ప్రథమాధ్యాయము

శ్రీ కృష్ణార్పణమస్తు.





# ఉత్కల విప్ర వంశ ప్రదీపిక.

## ద్వితీయాధ్యాయము

## వ్యవహారకాండ.

—:(o):—

విద్యలను వ్రాయుట, చదువుట, రాజసభలయందు నిర్వాహించు నసాధ్య కార్యంబులను చక్కజేయుట, గణిత శాస్త్రములందు సూక్ష్మబుద్ధిని గలిగి వర్తించుట, ఇత్యాది ధర్మముల చేతను, "శిష్ట" అనుభావముచేతను చిత్రగుప్త వంశస్థులైన కరణంబులు నీలోకంబున విఖ్యాతిని పొందుచున్నారు.

"శిష్టాని వ్యతిరిక్తాని అధీత్య పఠిత్వా-శిష్టావిశంతికా భవంతి"—శిష్టేషు వా-శిష్టభాగాః ప్రవేశయోగ్యాః-శిష్టాఅష్టావింశతి గణానాం పూరకారః-సర్వశ్రేష్ఠోభవతి-ఉపగ్రంథవినియోగః పతీతారః శిష్టకరణాః - శిష్టకరణః
(కమలాకరభట్టప్రణీత "చణవ్యూహము")

శిష్టకరణములకు ఆదిపురుషుడైన చిత్రగుప్తఋషి-పరాశర-బ్రహ్మ-యేతన్మూర్తిత్రయుల తేజసాంశ సంమేళనచేత జనితు

లై ఈభూలోకములో భూపతులయొక్కయు లోకులయొక్కయు గుప్తములగు చిత్రవిచిత్ర కార్యములను చక్కజేయుచు ఈశిష్టకరణ కాయస్థులు ప్రవర్తింపుచుందురు.

శ్లో॥ కాయస్థాశ్చిత్రగుప్తాంశాః
బ్రాహ్మణోపిన సంశయః।
నృపాణాం వ్యవహారాయ
సురశ్రేష్ఠేన యోజితాః॥ (భవిష్యపురాణము)

బ్రాహ్మణులైన కాయస్థ-శిష్టకరణములను - ఇంద్రుడు -భూపతుల వ్యవహారముల నిమిత్తము నియమించెను.

ఈ శిష్టకరణాన్వయ సంఘమువారలుత్కల దేశమునుండి కళింగ దేశమునకువచ్చి భూపతులవద్ద మంత్రులై కార్యములనుచక్కజేయుచుండిరి. తదుపరి ఆంగ్లేయ ప్రభుత్వములో ఇంగ్లీషువిద్య ప్రబలమై తమ తమ ఆది విద్యలు నానాటికి క్షీణదశకువచ్చియుండుటచేత భూపతులు ఆంగ్లేయవిద్యా ప్రవీణులను తమ తమ వ్యవహారములు చక్కజేయుటకుగాను మంత్రులుగా యేర్పరచుకొనుటచేత ఈ శిష్టకరణములు మొట్టమొదట ధనమదాంధులై నింగ్లీషువిద్య నభ్యసింపక క్షీణదశకువచ్చి మంత్రాంగములను చాలారాష్ట్రములలో విడిచినప్పటికి విస్తారముగా గ్రామవుద్యోగస్థులై మునసద్దీ ప్రవృత్తులచే ప్రవర్తించుచుందురు. వీరియొక్క యోగ్యసాంప్రదాయకమును బట్టియు పూర్వోక్త

త స్థితినిబట్టియు అంగ్లేయ ప్రభుత్వముగూడా దయాళువై తమ విద్యా సంకేతము స్థాపించి ఈ సంఘము వారికి విద్య కరవుటచే చాలామంది ఆంగ్లేయ విద్యా ప్రవీణులై తగునుద్యోగములు చేయుట కవకాశము చిక్కినది.

వీరి మొదటి ముఖ్యాంగ స్థానములు.

సంస్థానము పేరు. దివాను పేరు.

1. మాడుగుల—చక్రధర మహాంతి లింగయ్య పట్నాయక్.
2. అనకాపల్లి- శేఖరమహాంతి ఆనంద పట్నాయక్.
3. శృంగవరపుకోట- పాత్రుని మహాంతి కృష్ణమహాంతి ప॥
4. విజయనగరం-పక్కి వెంకటప్పయ్య పట్నాయక్.
5. చీపురుపల్లి-కుప్పిలి దాలయ్య పట్నాయక్.
6. పాలకొండ-మెల్లుమహాంతి పరశురామ పాత్రో.
7. బొబ్బిలి-పట్నాయకుని రామయ్య పట్నాయక్.
8. సాలూరు—పక్కిలక్ష్మీ నర్సయ్య పట్నాయక్.
9. పాచిపేట-త్యేడచిట్టియ్య పట్నాయక్.
10. చెముడు-డొంకాడ జయరామయ్య పట్నాయక్.
11. మక్కువ-భోగిలవెంకయ్య. మక్కువనీలయ్య పట్నాయక్
12. పార్వతీపురం- పాత్రేరు అప్పయ్య పట్నాయక్.
13. సంగంవలస-మక్కువ రామస్వామి పట్నాయక్.
14. మేరంగి-బెహరా దాలయ్య పట్నాయక్.

15. జయపురం-రాధాక్రిష్ణ గోపినాధొ పట్నాయక్.
16. కురుపాం-నదుకూరి రంగనాయక పట్నాయక్.
17. సిర్లాంకోట జమీన్‌దారు వక్కవెంకటరావు.

ఈ పైచెప్పిన జమీలన్నియు గోలుగొండ నవాబుగారి పరిపాలనలో నుండునపుడు శ్రీగాకూళము తక్తుకు షేరుమహమదుఖా సాహెబుగారి తదనంతరము అనగా 17వ శతాబ్దములో (1641) కుప్పిలి కూర్మయ్య పట్నాయకులు గారు నబునవాబుగా కొంతకాలము రాజాంగముచేసిరి. వారి తదనంతర మీయాంగ్లేయ ప్రభుత్వ మీ దేశపరిపాలనకు వచ్చినది.

జీవకోటియొక్క పాపపుణ్యములను పరిశీలించుటకై బ్రహ్మవద్ద చిత్రగుప్తుఋషి యెట్లికార్యవాదముల జరపుచుండునోయటులనే నీభూలోకములో భూపతులవద్ద చిత్రగుప్త వంశజులైన శిష్టకరణ కులజులు ప్రవర్తించినట్లు పైని వివరింపబడిన యుద్యోగములనుబట్టి తేటతెల్లమైనది.

ఈపంచగౌడ బ్రాహ్మణులలోని చిత్రగుప్తాన్వయులైన శిష్టకరణ శాఖవారినే లౌకికవ్యాపారము నిమిత్తమై పంచద్రావిడ బ్రాహ్మణులలో నియోగింపబడిన శాఖస్థులుగూడ వ్యాపారకరణములనియు, నియోగ కరణములనియు నామంబులు వహించి మంత్రాంగ ప్రముఖ గ్రామోద్యోగాది మునద్దీధర్మములలో ప్రవర్తింపుచుందురు.

ఈ భరతఖండములో శిష్టశాయుస్థ కరణములు ఉత్తరావర్త

లౌకికులనియు, నియోగ కరణములు దక్షిణాపథ లౌకికులని యు, శిష్టకరణములు పూర్వాపథలౌకికులనియు, వ్యాపారకరణములు పశ్చిమాపథ లౌకికులనియు వ్యవహరింపబడుదురు. వీరందరు వేదవేత్తలై త్రికర్మాధికార బ్రాహ్మణులై వర్తింతురు. నియోగకరణములు, వ్యాపారకరణములు ఆంధ్రదేశనివాసులగుటచే పంచద్రావిడ బ్రాహ్మణశాఖస్థులైరి. శిష్టకరణములు, శిష్టకాయస్థకరణములు గౌడదేశవాస్తవ్యులగుటచే గౌడ బ్రాహ్మణశాఖస్థులైరి.

శ్లో॥ దక్షిణే లౌకికాశ్చైవ పశ్చిమేచ వ్యాపారిణః।
ఉత్తరే మహింసభుక్తంచ మాంసమత్స్యభుక్తిషు॥

అనుశ్లోకోక్తి ననుసరించి పైనాల్గు శాఖలకరణములకు పరస్పరభోజన ప్రతిభోజన సంబంధబాంధవ్యాదివ్యవహారములు లేవు

గద్య. ఇది శ్రీమద్గోపాలకృష్ణ పరబ్రహ్మ కరుణా కటాక్ష
లబ్ధవిద్యావైభవ కాత్యాయనసూత్ర యాజ్ఞవల్క్య
గోత్ర గౌడ బ్రాహ్మణ శిష్టకరణవంశోద్భవ కుప్పిలి
రంగయాఖ్య వసుక్షితియుసయుగణ విధేయ
కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన
శ్రీమదుత్కళ విప్రవంశ ప్రదీపిక
యను గ్రంథంబునందు
ద్వితీయాధ్యాయము
సంపూర్ణము



# ఉత్కల విప్ర వంశ ప్రదీపిక.

## తృతీయాధ్యాయము.

### బిరుదావళి కాండ



శిష్టకరణకులజులు గంజాం విశాఖపట్నం జిల్లాలలో విస్తరించి నివసించియుందురు. వీరు 'పట్నాయకో' 'మహాపాత్రో' 'శర్మ'-'మహాంతో'-'పాండిత్రో'-'మిశ్ర'-'బైశికో'- అనువారు వనామములు వహించెదరు.

శ్లో॥ మాతాపుత్రీయ ధర్మాణి ధీమంతశ్చానకీర్తితః।
తేషాంవై శస్త్రభేదేన దత్తాశర్మేతిచేచ్యతే।

రాజులకు నర్తన పద్ధతంబులు చేయుటచే శిష్టకరణులు "దీమంతో" అనియు, శస్త్రభేదవిద్యను గరపుటచే శిష్టకాయస్థులు "దత్త" అనియు, శిష్టకరణులు "శర్మ" అనియుబిరుదులు వహింతురు.

శ్లో॥ మాత్రకుక్షిం సమాశ్రిత్య గుప్తోయస్మాచ్చ వేశ్యవై।
తస్మాత్ గుప్తేతి నామాసిల్లోకేఖ్యాతః ప్రతిష్ఠితః॥
(భవిష్యపురాణము)

మాతృకుక్షియందు ప్రవేశించి గుప్తముగానుండుటచే సూతాది త్రివిధకరణములు 'గుప్త' అనియు బిరుదును వహింతురు.

శ్లో॥ పితుర్మాతుశ్చ సంబంధాం చిత్రమాహిమ్యకః స్మృతః।
భగవాన్ దాసభావేన కేచిందాసేతి తాన్ విదుః॥
(భవిష్యపురాణము)

తంత్రి అన్యపురుషుండుగాన మహిమ్యాంబష్టాది మహాంతికరణములు భగవంతుని సదాధ్యానించుటచే 'దాస' అనియెవరు ఈలాగున బిరుదావళులు భవిష్యపురాణములో వర్ణించబడినవి. గ్రంథ బాహుళ్యముచేత తక్కినబిరుదులు యీపురాణములో విడిచినప్పటికి పద్మపురాణములో కరణములయొక్క వ్యవహారాది విధానమంతయు వర్ణించి యున్నది. అందులో కరణములకు 'పట్నాయక్', 'రాజదత్తు', 'పాత్రో' అను ఇత్యాది బిరుదావళులుగలవు.

శ్లో॥ మహాబుద్ధితయా తేతు మహాజ్ఞానయితిస్మృతః।
వ్యాజాత్యుత్కర్షభ్యాంగతే శిష్టకరణంమతః।
నవతః ప్రాప్యశటీకాం పట్టనాయక్కృతం గతాః।
శిష్యాధ్యయనకారిత్వే నాయకఃపరికీర్తితః।
కేతులోకే మహాఖ్యాత మహాప్రాశస్త్యతాం మతః।
మహాసౌభాగ్యత్రయా తేతు మహాపాత్రో తియారితః

ఆగ్రహాయిత దాతృత్వదం లభితిమర్దలాః।
వర్ధిల నానన ంవ తు వీణా వాదన వైణికః॥

మహాబుద్ధిమంతులగుటచే 'మహంతి' స్వజాతిలో నుత్కృ
ష్ట సాధనంబులు చేయుటచే శిష్టకరణంబులు రాజులకు పట్టాభి
షిక్తవేళలందు పట్టు(కిరీటము) ధారణ చేయించువారు గాన
'పట్నాయక్'- శిష్యులకు విద్యగరపుటచే 'నాయక్' లోక
మందు మంచికీర్తి వహించుటచే 'మహాప్రశస్త' మహా యో
గ్యులగుటచే 'మహాపాత్రో' సంగీతమృదంగాది వీణలందు ప్ర
వీణులుగా "వైణిక." అనియిత్యాది బిరుదులతో వీరలు నీలో
కములో సంచరించెదరు.

గద్య॥ ఇది శ్రీమద్గోపాల కృష్ణ పరబ్రహ్మ కరుణా కటాక్ష
లబ్ధ విద్యావైభవ కాత్యాయని సూత్రయాజ్ఞ వల్క్య
గోత్రగౌడ బ్రాహ్మణ శిష్టకరణ వంశోద్భవ కుప్పిలి
రంగ యాఖ్య చతుర్థతనయ నయగుణ విధేయ
కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన
శ్రీ మదుత్కలవిప్రవంశ ప్రదీపిక
యను గ్రంథంబునందు
తృతీయాధ్యాయము
సంపూర్ణం.





# ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

## చతుర్థాధ్యాయము
## కర్మకాండ.

—o—

శ్లో॥ సంస్కారైః శోధయేనిత్యం
బ్రాహ్మణక్షత్రియ వైశ్యకానితి।
స్మృతిసంబోధితాయా సంస్కారవిద్యాం
బ్రాహ్మణానాం క్షత్రియస్య వైశస్యచాధికారః॥

ద్విజులైన బ్రహ్మ క్షత్రియ వైశ్యులు పంచసంస్కారనియా
మకులు.

శ్లో॥ జాతకర్మాదిభిర్యస్తు సంస్కారైస్సంస్కృతశ్శుచిః।
వేదాధ్యయన సంపన్న షట్కర్మస్వవస్థితః।
శౌచాచారస్థితస్సమ్య గ్విఘసాశీ గురుప్రియః।
నిత్యవ్రతీసత్యపరస్సవై బ్రాహ్మణఉచ్యతే।

ఎవడు జాతకర్మ మొదలైన సంస్కారములచే సంస్కరింపబ
డినవాడో-శుచిగలవాడో-షట్కర్మనిరతుడైనవాడో-పరిశుద్ధమైన
ఆచారములు గలవాడో దేవతులకు అతిథులకు నివేదనమైన
పదార్థమును భుజించువాడో, గురువునందు విశ్వాసము గలవా

డో, నిత్యవ్రతముగలవాడో, సత్యమందాసక్తిగలవాడో, వాడు బ్రాహ్మణుడుగా చెప్పబడుచున్నాడు.

శ్లో॥ సత్యందానమథాద్రోహ ఆన్యశంస్యంత్ర పాఘృణా।
తపశ్చదృశ్యతేయత్ర సబ్రాహ్మణ ఇతిస్మృతః॥

సత్యము, దానము, ద్రోహముచేయుచుండుట, అపకారాహిత్యము, లజ్జ, దయ, తపస్సు ఎవనియందు కనబడుచున్నదో వాడుబ్రాహ్మణుడుగా చెప్పబడియె.

శ్లో॥ సర్వభక్ష్యరతిర్నిత్యం సర్వకర్మకరోశుచిః।
త్యక్తవేదస్త్వనాచారస్సవై శూద్రం ఇతిస్మృతః॥

ఎల్లప్పుడు ఎవడు సమస్తమును భక్షించుట యందాసక్తిగలవాడో, అన్నివిధములైన కృత్యములు చేయువాడో, చెడుదువర్తనుగలవాడో, వేదాధ్యయనమును చేయకుండువాడో, అనాచారముగలవాడో, వాడుశూద్రుడని చెప్పబడును.

శ్లో॥ శూద్రేచైతద్భవేల్లక్ష్యం ద్విజేతచ్చన విద్యతే।
నవైశూద్రోభవేచ్ఛూద్రో బ్రాహ్మణో బ్రాహ్మణోచనః॥

ఈ పైనుదహరించిన గుణములు శూద్రునియందు లేనియెడల నావాడుశూద్రుండుగాడు. ఇట్టిగుణములుగల బ్రాహ్మణుడు శూద్రుడేగాని బ్రాహ్మణుండుగాడని మహాభారతము శాంతిపర్వ

ములో భారద్వాజఋషి భృగుఋషితో చెప్పెను.

శ్లో॥ బ్రాహ్మణాంతు స్వయంకుర్యాః
సంస్కారాన్ వేదచోదితాన్।
తేషాంవేదోక్తకార్యేషు సాక్షాన్ముఖ్యాధికారతః॥

ఇతి స్మృతివాక్యసారాత్ బ్రాహ్మణైః స్వయం సంస్కారః క్రియంతేన తేషామితరాపేక్షా అత్రవాక్యాంతర మపిప్రమాణం॥

బ్రాహ్మణుని వేదాధికారమునుండుటచే వేదోక్తముగాసంస్కారము తానుస్వయం చేసికొనును. ఈప్రకారము స్మృతిచెప్పుచున్నది.

శ్లో॥ ఇతరాపేక్షారాన్ కర్తకుర్యు జాతీయః।
వేదాధికారిణయస్మాత్ భూసురాస్తే ప్రకీర్తితః॥

బ్రాహ్మణుడు ఇతరాపేక్షలేకనే సంస్కారవిధి తానుస్వయమున చేసుకొనుటచే భూసురుడని పిలువబడును.

శ్లో॥ క్షత్రియస్య తథావైశ్య వేదోక్తకర్తనిష్ఠితే।
నియమ్యః బ్రాహ్మణాన్ పూర్వ్యంతః వైశ్యామేత్తనా।

గాన బ్రాహ్మణులలో కర్మాధికారము గలవాడు తనితర క్షత్రియ వైశ్యులు షట్కర్మాధికారముగల బ్రాహ్మ

ణుల నియమించుకొని వారిచేకర్మలను వేదోక్తముగా జరిగించుకోవలయునని యు,

శ్లో॥ షట్క్రియాయుతి వా వైశ్యాః కుర్వీతే వైదికంతు యత్।
తేనదోషం లభంతే తేనఫలం హితమాత్మనః॥

వైశ్య కర్తలాము స్వయమున జరిపేయుడల నదిదోషయుక్తమని బృహన్నారదీయములో చెప్పబడియున్నది. దోషము సంభవించునుయేగాక సట్కర్మ వినియోగపడనేరదుగాన షట్కర్మాధికారముగల బ్రాహ్మణునిచే పంచ సంస్కారంబులుచేయించుకొనుట కర్తవ్యంబని కూర్మపురాణములో చెప్పబడినది.

వైశ్యకరణంబులు గౌడ సాంప్రదాయంబును విడువక వేదోక్తోపనయన వివాహాది పంచసంస్కార కర్మలను మతానుసరణ దేవపూజనానుష్టాన వ్రతంబులను సతతంబుచేయుచుందురు.



## 1 విద్యారంభః.

ఆచార్యుని నుచ్చరించి వినాయక సరస్వతీపూజలనుజేసి లేఖనపూజచేయునది. పిమ్మట గురువునకు వస్త్రాలంకారములచే పూజచేసి విద్యారంభణచేయునది. బాలునిచే మొదట సరస్వతీదేవిని స్మరియింపజేయునది. ఈకర్త ఉపాధ్యాయ కరణములేనియెడ

టకధికారముకద్దనిపరాశర స్మృత్యుక్తికలదు.గాన నీః ద్యాగురు వులచేతనే నీక ర్మలోకంబునందు అనాతసిద్ధముగ జరుగుచున్నది.

శ్లో॥ కాయస్థః శిష్టకరణః సంస్కారిణోయది।
తదా తేయోగ్యతామ పూర్వోద్యారంభే చ వైద్విజః॥

ఇతి భవిష్యపురాణవచన ప్రమాణేన సంస్కారాన నంతరం కాయస్థ శిష్టకరణాదినాం విద్యారంభే భవతి.

భవిష్య పురాణములో శిష్టకరణములు విద్యారంభ కర్మచే యించుటకు విధికనబడుచున్నందున వారలు ద్విజులనుటకు సందియంబులేదు. శిష్టకరణంబులు బ్రహ్మఋషి సంతానులై ఋషి గోత్ర ప్రవరలనుగలిగి పంచ సంస్కారాది కర్మలను వేదోక్త ముగా జరిగించుకొందురు. వీరలార్యులు మొదట గంగానదీతీర మునయున్న నుత్కలదేశమునుండి కళింగదేశమునకు వచ్చిరి. వీరలు సామవేదులు,కాత్యాయన సూత్రజ్ఞులు, గౌడశాఖవారు ఈకళింగదేశములోకొన్నిభాగంబులందు గౌడశాఖ వైదిక బ్రాహ్మణులు లేకపోవుటచే నాయా స్థలాచారములంజేసి ఆయా వేదములు, సూత్రములచే కర్మవేదోక్తముగా జరిగించు కొందు రు. కాత్యాయనీ సూత్రజ్ఞులు, గౌడ సాంప్రదాయకులగుటచే వారియొక్క ఆర్య దేశాచారనమువళ్ళను విడువక ఆచరించుచుందురు.

శ్లో॥ జాతివిప్రోదశాహేన ద్వాదశాహేన భూమిపః।
వైశంపంచదశాహేన శూద్రమాసేన శుధ్యతి॥

అనగా మృత శూచికము బ్రాహ్మణులకు పది దినములు, క్షత్రియులకు పన్రెండు దినములు, వైశ్యులకు పదునైదుదినములు, శూద్రులకు నెలదినములు జరుగుచున్నది. ఇటువలెనే శిష్టకరణములకు మృతాశూచము పది దినములతో శుద్ధమగుచున్నది. శిష్టకరణములుత్కల బ్రాహ్మణులగుటచే వీరికి ద్రవిడబ్రాహ్మణులవలె గృహ నామములు లేవుగాని వీరలువిస్తరించి కళింగ దేశమునందలి గ్రామములలో వసించియుండుటచే నాయా గ్రామ నామములను సంజ్ఞార్థమై తమ తమ గృహనామములుగా వాడుకొనుచున్నారు; గాని అవిస్థిరములైనవిగావు. గనుకనే వివాహాది కార్యములు జరిగించునప్పుడు తమ తమ గోత్ర సూత్ర ప్రవరల ననుసరించి సంబంధ బాంధవ్యములను జరపుకొందురు. వీరల గోత్రములు, ప్రవరములు, ప్రవర కాండములో నవిస్తరముగా వర్ణింపబడియె.

---

## 2. ఉపనయనః

### ఉపనయన కాల నిర్ణయము.

అష్టవర్షం బ్రాహ్మణం ముపనీయతే-యాజ్ఞవల్క్యః గర్భాష్టమేవ నవమేవ బ్రాహ్మణః స్సూపనయనం॥

బ్రాహ్మణునికి గర్భ సంవత్సరము మొదలుకొని ఎనిమిదవ

సంవత్సరమున గాని తొమ్మిదవ సంవత్సరమునగాని ఉపనయనము చేయవలయునని యాజ్ఞవల్క్య స్మృతియందు చెప్పబడియున్నది.

మూ॥ ఆషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీనాతి వర్తతే।
అతఊర్ధ్వంత్రయోప్యేతే యథాకాలమ సంస్కృతాః।
సావిత్రీపతితావ్రాత్యాభవం త్యార్యవిగర్హితాః॥
(మనుధర్మశాస్త్రము)

బ్రాహ్మణులకు పదునారు సంవత్సరముల వరకును ఉపనయనము ఆసందర్భములో చేయనియెడలను సావిత్రీమంత్రమునక యోగ్యులై జాతిబ్రష్టులై సజ్జనులచే పరిగ్రహింపబడరు.

## ఉపనయన కర్మవిధి.

ఈకర్మ బ్రాహ్మణులకు రెండుదినములలో సమాప్తియగును. మొదటిదినమునందు:—

(1) పుంసవనము. గర్భ సంస్కారము రెండవ, మూడవ మాసము, పుష్యనక్షత్రమున గర్భపిండమును సంస్కారము చేయవలసియుండును గాన, కాల మతిక్రమించుటచే నీదోషమునకు ప్రాయశ్చిత్త హోమము జరుగబడును. తరువాత దేశకాలావంతర సంకల్పము, పంచభూ సంస్కారములచే హోమము జరుగబడి తరువాత పుణ్యాహవచనము, మాతృపూజ, వసుర్ధార, అభ్యుదయిక శ్రాద్ధము తల్లిదండ్రులచే ఉపవాసముతో జరుపబడును.

ఈకర్మ పూర్తిఅయిన తరువాతను దశబ్రాహ్మణ భోజనము ఆశీర్వాదము జరుగబడును.

(2) సీమంతము. అధివాసబోయిపాల పూజ అనగా మంగళారోపణముఅయిన తరువాతను మంటపమునకు ఈశాన్య భాగమున పాతాళపూజ నిమిత్తము రెండురాటలు పాతబడును. పిమ్మట వరుణపూజ, పుణ్యాహవచనము, హారిద్రాలేపనము, ఆశీర్వాదము, అభ్యుదైకశ్రాద్ధము, మాతృపూజ, వసుధార ఇతర లౌకిక వ్యవహారములు జరుపబడును. తల్లిదండ్రులు నూతన వస్త్రములను ధరింతురు. సీమంతము నేడవమాసములో జరుగనందుకుగాను ప్రాయశ్చిత్తహోమము జరుగబడను, మార్జనము, ఆచార్యదక్షిణ, నాందీశ్రాద్ధము, దశబ్రాహ్మణ భోజనము, శాంతికరణము, పుణ్యాహవచనము జరుగబడును.

(3) జాతకర్మము. పంచకర్మలు, 1. వరుణపూజ, 2. అభ్యుదైక శ్రాద్ధము, 3. దశదిక్పాలపూజ, 4. మాతృపూజ, 5. వసుధార పిమ్మట సంకల్పము జాతకర్మ కాలాతీతమగుటచే దేశకాలానంతర ప్రాయశ్చిత్త హోమము పంచభూ సంస్కారములతో జరుగబడును. పిమ్మట పుణ్యాహవచనము.

మూ॥ అహాయేకాదశేనామం చతుర్థమాసే నిష్క్రమణ
షష్టేఅన్నప్రాశనసేమాసి చూడాకార్యాయథాకులం॥

జాతమైన పదునొకండవ దినంబున నామకరణము, నాలుగ

నమాసములో వహిర్నిష్క్రమణము, (బిడ్డను బైటకు దెచ్చుట, ఆ దిత్యులలో వేయుట, ఇత్యాది) ఆరవమాసములో అన్నప్రాసనము, కులాచారముచే పిమ్మట చూడాకరణము (చౌలము) అనగా కేశఖండనము జరుగబడును.

(4) నామకరణము పైనదాక్కాణించిన ప్రకారము ప్రాయశ్చిత్తహోమాది కర్మలు జరుగబడును.

(5) వహిర్నిష్క్రమణము. చతుర్థమాసము అతిక్రమించుట చే పైచెప్పినప్రకారము ప్రాయశ్చిత్తహోమాది కర్మలు జరుగ బడును.

(6) అన్నప్రాసనము. ఆరవమాసములో ఈకర్మ జరుగుట అతిక్రమించుటచే పైచెప్పబడిన ప్రకారము ప్రాయశ్చిత్త హోమాది కర్మలుజరుగబడును.

పైవివరించు నారుకర్మలు గృహముయొక్క లోభాగమున మొదటి దినంబున జరుగబడును.

రెండవదినముందు జరుగవలసిన కర్మలు 1. చూడాకరణము (చౌలము), కర్ణవేధనము, 2. ఉపనయనముభిక్ష, 3. ఉపాకర్మ ము, (వేదములు చదువనారంభించుట) 4. సమావర్తనము.

ఈ కర్మలుయింటి ఎదుటి మంటపముపై జరుగబడును.

(1) చూడాకరణము. (చౌలము) కర్ణవేధనము. కులాచార విధులప్రకారము కేశఖండనము జరుగును. ఈకర్మకు సంకల్పము

పుణ్యాహవచనము, మాతృపూజ, వసుర్ధారా, అనాదేశ ప్రాయః
శ్చిత్తము, పంచభూసంస్కార హోమము, అభ్యుదైక శ్రాద్ధము,
దశబ్రాహ్మణ భోజనము, బాడ్గుడికతో దంతధావనము, స్నా
నము, ఆచమనము, వస్త్రపరిధానము, తిలకాదిగ్రహణము చేసి
బాలునికి మంత్రములతో కర్ణవేధనము చేయబడి ఆశీర్వాదము
చేయబడును.

(2) 1. <u>ఉపనయనము విధి.</u> వైశ్వదేవపూజ, వరుణపూజ,
సంకల్పము, అభ్యుదైకశ్రాద్ధము, మాతృపూజ, వసుర్ధార, దశ
బ్రాహ్మణ భోజనము, పంచభూ సంస్కారములతో హోమము,
దేశకాల పాత్రానుసారదానము, బ్రహ్మచారి నియమము,
(కౌపీనధారణము, కటిసూత్రము, యజ్ఞోపవీతము, కృష్ణాజినీఉ
త్తరీయము, పాలాశదండము, కుశవటుగ్వయము, వీటిని మంత్ర
ములతో ధరించి) సంధ్యావందనముచేయును. పిమ్మట అగ్నిప్రద
క్షిణము, హోమము, ఆచార్యునిద్వారా బ్రహ్మచారిచే కర్త్మ
లనుగూర్చి ప్రమాణముచేయించుట, గాయత్రీవుపదేశము.

(3) <u>భిక్షావిషయః.</u> ఎడమచేతితో నూతనకంచుపాత్రను బ్ర
హ్మచారిబట్టి అందుపై అంటియాకునుబెట్టి లేచుట. అప్పుడు త
న మేనమామ సహితము యీ పాత్రను తనయెడమహస్తముచే
బట్టి రెండవహస్తముచే ఉదక పాత్రమును బట్టుట. పిమ్మట బ్ర
హ్మచారి భిక్షకు ప్రారంభించగా తనతల్లి ప్రథమతః భిక్షవేయు
ను. తదుపరి తనతండ్రి బంధువులు యావన్మంది వరుసగా భిక్ష

నువేయుదురు. పిమ్మట ఆచార్యుని అనుమతినిబొంది బ్రహ్మచారి తనతల్లికి తానెత్తినభిక్షను సమర్పణ జేయును. దశబ్రాహ్మణభోజనము, శాంతికరణము,పుణ్యాహవచనము, బ్రాహ్మణదక్షిణ దానములు, ఆశీర్వాదము.

(4) వేదారంభః. ఆదినివరుణపూజ, పిమ్మట దేశకాలవాక్యాంతరసంకల్పము, అభ్యుదైకశ్రాద్ధము, మాతృపూజ, వసుర్ధార, శ్రాద్ధములేక బ్రాహ్మణభోజనము, పంచభూసంస్కారహోమము, ప్రాసనము, మార్జనము, బ్రాహ్మణదక్షిణదానము, ఆశీర్వాదము, పిమ్మట అగ్నికి ఉత్తరభాగమున బ్రహ్మచారి తన ఆచారికి నెదురుగా కూర్చొని క్రింద నూతనవస్త్రమును పరచి గురు పాదమునకు సమీపమునందు నారికేళమునుంచి తనహస్తములచే గురు పాదములను బట్టి తనబ్రహ్మచారినామమును తెల్పరచును పిమ్మట గురువు ఆశీర్వాదముజేసి వేదాధ్యయనమును జేయించును తదుపరి వసుర్ధార, దశబ్రాహ్మణభోజనము, ఆశీర్వాదము, పుణ్యాహవచనము జరుగును.

(5) సమావర్తనము, ప్రథమతవరుణపూజ, దేశకాలవాక్యాంతరసంకల్పము, అభ్యుదైకశ్రాద్ధము, మాతృపూజ, వసుర్ధార పుణ్యాహవచనము, తిరిగి పంచభూసంస్కారములతో హోమము, ప్రాసనము, మార్జనము, బ్రాహ్మణదక్షిణదానములు, ఆశీర్వాదము, అగ్నిప్రదక్షిణ, కుంభాభిషేకము, ద్వాదశాంగుళీప్రమాణముగల బొడ్డపుల్లతో దంతధావనము, ఆచమనము, క్షురకర్మ

స్నానము, ఆచమనము, వాసన ద్రవ్యములచే తిరిగి స్నానము, ఆచార్యుని వద్దనుజేరి గంధలేపనము, అలంకార వస్త్ర ధారణము, కజ్జలము, కుంకుమ, ముకుటబంధనము, దర్పణే ముఖావలోకనము, ఛత్రగ్రహణము, పావలగ్రహణము, దండగ్రహణము; కుశవటుగ్రహణము, అగ్నివిసర్జనము, శాంతికరణము, అచ్ఛిద్రావధారణము, పుణ్యాహవచనము జరుగును. తదుపరి బ్రహ్మచర్యముతో తనగృహమును వెడలును. అంత తనమేనమామ వెంబడించి బ్రహ్మచారిని అడ్డుకొని వానిని గృహస్థాశ్రమము పొందుమనియు, తనకుమార్తెను యతనికిచ్చి వివాహముచేయుదునని వాగ్దానముచేసి వానిని దేవాలయమునకు గొనిపోయి నచట దేవతారాధనముచేసి తన గృహమునకు తీసుకొనివెళ్ళును. పిమ్మట మధుపర్కములతో బ్రహ్మచారినిన్ని, వానితండ్రినిన్ని సమాధానముచేయును. బంధుభోజనము జరుగును. తదుపరి నిర్ణయించిన లగ్నములో వివాహము నడిగువ నుదహరించు ప్రకారము జరుగబడవలయునని సామవేదములో శంభుకరపద్ధతిలో చెప్పబడియున్నది.

## 3. అథవివాహః

అథ బ్రాహ్మణస్య వర్ణానుక్రమేణ చతస్రోభార్యా భవన్తి। తిస్రః క్షత్రియస్య। ద్వేవైశ్యస్య। ఏకాశూద్రస్య। తాసాం సవర్ణావేదనే పాణిర్గ్రాహ్యః। అసవర్ణా వేదనేశరః క్షత్రియకన్యయా। ప్రతోదో వైశ్యకన్యయా। వసనదశాన్తః శూద్రకన్యయా।

తా॥ బ్రాహ్మణుడు నాల్గువర్ణముల స్త్రీలను, క్షత్రియుడు మూడుజాతుల స్త్రీలను, వైశ్యుడు రెండుజాతుల స్త్రీలను క్రమముగా స్వజాతిస్త్రీని వివాహమైన తరువాతను వివాహము చేసికొనవచ్చును. శూద్రుడు స్వజాతిస్త్రీ నొక్కరితనే గ్రహించవలయునని స్మృతి చెప్పుచున్నది.

మాతులస్యసుతాముాఢ్వా మాతృగోత్రాంతరైవచ। సమానప్రవరాంచైవత్యక్త్వా చాంద్రాయణంచరేత్ ॥ అసపిండాచ యా మాతురసగోత్రాచయాపితుః । సాద్విజానాం ప్రశస్తాస్త్రీ దారకర్మణిమైథునే॥

తా॥ మేనమామ కుమార్తెనుగాని, తల్లి గోత్రమునందలి కన్యనుగాని, తల్లివంశపు ప్రవరతో సమానమైన ప్రవరగల కన్యనుగాని వివాహము చేసికొనినయెడల అట్టి కన్యనువిడిచి చాంద్రాయణవ్రతము చేయదగినది. ఏకన్యతల్లికి సపిండురాలుకాదో యేస్త్రీతండ్రికి సమానగోత్రము కలదికాదో, ద్విజులకు ఆస్త్రీ వివాహమునకు తగినది.

స్వగోత్రీకులకును, ప్రవరలు గలయువారలకును పరస్పర వివాహములు లేవు. ఇందు విషయమై స్పష్టముగా రాబోవు ప్రవరకాండలో వక్కాణింపబడియె.

## వి వా హ వి ధి ః.

---

గాడబ్రాహ్మణ శిష్టకరణముల వివాహవిధి నిర్ణయమేమన. పురోహితునిచేత మంగళారోపణ చేయబడి దేవతారాధన త

రణావిధి జరుపబడును. మంగళారోపణ అయిన తరువాతను వ
స్త్రాలంకారములను వేదోక్తముగాపూజించి వరునికి నలంకరిం
చునది. పిమ్మట జలపూర్ణకుంభమును వివాహవేదికకు బూర్వది
శయందు నిచిగణపత్యాధి దేవతకు దూర్వాక్షతపుష్పములతో
పూజజేసి మాతృగణపూజ, స్వస్తివచనము, అభ్యుదయిక శ్రా
ర్ధము జేసి బ్రాహ్మణులను యథాశక్తిని దక్షిణలచే సంతుష్టిచే
యబడును, భోజ్యాన్నాగ్ర వసుర్ధారాధి విధులను జరపి బ్రాహ్మ
ణులచే ద్వితీయవరుణము జరిగించబడును. తరువాతను గంధాది
వాసనలు, లవణచామరము(తలంబ్రాలు బియ్యము)చేసి వస్త్రా
లంకారముల సహితముగా అంబికాపూజ యొనరించి కన్యకకు
తన బంధువులచేబట్ట తెరవేయించి వరునిపై లవణచామరము వే
యబడును. వరకన్యకలకు కౌతుకసూత్రముచే పాణిగ్రహణచే
యబడును. బ్రాహ్మణులు వేదవాక్యములు పఠించుచు వరకన్య
కలు పరస్పరావలోకనముచేసిన తరువాతను శిలారోహణముచే
యబడును. అటుపిమ్మట యథాశక్తిని హోమముచేసి వస్త్రాలం
కారములచే పురోహితపూజ యిత్యాదికర్మ బ్రాహ్మణ విధిగా
చేయవలయునని విష్ణుపురాణములో చెప్పబడియున్నది. శిష్టక
రణకులజులు గాడ సాంప్రదాయకులగుటచే వారివివాహములు
అరునొక దినము యీక్రింద వివరించురీతిగా జరుపబడును.

మొదటి దినము. మంగళారోపణ, పితృవైశ్వదేవవిధి, జో
యిసాలారూపణ (పందిరరాటవేయుట), లవణచామరము(తలం

(ప్రాలు బియ్యము), నాందీశ్రాద్ధము.

రెండవ దినము. లగ్నము, (1) ప్రథమవరుణ, (వరునికిగంధాది యజ్ఞోపవీత నూతనవస్త్రధారణచేసి పాద ప్రక్షాళనజేసి వానిని కన్యకయింటికి రప్పించుట), (2) కుంభపూజ (దశదిక్పాల పూజ), (3) మాతృగణపూజ, (కళ్యాణమంటపము పై దక్షిణ భాగమున పీటవేసిఅందుపై అంగవస్త్రిము వేసి మొదటిదినమున అనగా గంధాదివాసములో పుణ్యాంగనలు తయారుచేసిన పసపుగుండ, పోకచక్కలు అందుపై కొంచముంచి మాతృగణ స్వరూపములను అందుపై లిఖించిపూజ చేయబడును) (4) వసుధ్ధార, (నేతితో ఆయిదు గీతలు కళ్యాణమంటపమునకు సమీపమందున్న గోడకు వ్రాయుట), (5) వాగ్దాన సంకల్పము (కన్యయొక్క తండ్రి పెండ్లి కార్యము చేయునని నోటితో వచించుట). తరువాత వరుడు తనవిడిదింటికిబోయి యచటనాందీశ్రాద్ధమునుజేసి కన్యయొక్క సూత్రమును వరుడు గొనిపోయి కంకణ ధారణము చేసికొనును. అలాగుననే వరుని సూత్రముతో కన్యక తనకళ్యాణ మంటపముపై కంకణధారణము చేసికొనును. దీనినే ప్రథమవరుణయని చెప్పబడును.

ద్వితీయవరుణ. వరుడు తిరిగీ స్త్రీరూపముతో కళ్యాణమంటపమునకు తెంచి హోమముచేయును. తరువాత వరుడు తన కాతుక స్త్రీరూపమునువిడచి నూతనవస్త్రిములను ధరించి పాణిగ్రహణము చేసికొనును. తరువాత పూర్వము వరునియొక్క సంబం

ధులు కన్యకను తనరూపలావణ్యములనుగూర్చి పరిశీలించెదరు. పాణిగ్రహణ సమయములో కన్యయొక్క తండ్రి "కటకమ" అనురాతునునకు కుశదర్భలచేతాను కూర్చొనియుండు ఆసనము క్రిందనుంచుకొనును. తరువాత సంకల్పమొనరించి దేశకాలవాక్యాన సంతరమందు పాణిగ్రహణముచేయును. స్వతినిమంతనము అనగా అరుంధతి అనుసూయాది పుణ్యాంగనలనుచ్చరించి ఆశీర్వచనముచేయబడును. కన్యావరుణ, లాజహోమము(వరి పేలాలచే హోమమొనర్చి వధూవరులయొక్క లజ్జను విడగొట్టుట) వరకన్యకలిద్దరు కళ్యాణమంటపముపై గవ్వలచేనాడియుభయులు ఇంటిలోభాగమునకువెళ్ళి యచట నిష్ఠదేవతాపూజలనొనర్చి గవ్వలచేనురలనాడుట. అటుపిమ్మట భోజనాది కృత్యములు జరుగబడును.

మూడవ దినము. బెద్ధిపొలియా. ఈదినమందు కన్యావరులచే కళ్యాణమంటపముపై గవ్వల నాడించుటయేగాని తదితర కర్మ యామంటపముపై జరుపబడనేరదు.

నాల్గవ దినము. ఉదయమున అభ్యుదయశ్రాద్ధము అనగా కన్యచేతను వండించి వరునియొక్క గోత్రములో కన్యనుకలుపుటకుగాను పితృదేవతులకు నివేదన జరుగబడును. నాటిరాత్రి ప్రథమభాగములో నగరుపూజ యనగా పంచవర్ణములతో కళ్యాణమంటపముపై కోతీవేసి అందుపై సిలనుంచబడును. ఆకోతీ (ముగ్గు)నాలుగుప్రక్కల నాలుగు కలశలనుంచి వానిలో బియ్యము

ముపోసి నాలుగు కర్రపుల్ల లుంచబడి వాటినిమాత్రముచే కట్టబడును. కన్యావరులను పాతవస్త్రములతోను మకుటములతోను మంటపముపై కూర్చుండబెట్టి వరుణపూజ జరిగిన పిదప విసర్జన మంత్రములచే వానిని విసర్జించి మంత్రపూర్వకముగా నూతన వస్త్రమకుటములను ధరించి పుణ్యాహవాచకము జరిగిన పిమ్మట కన్యావరులను సిలారోహణము చేయించి బంధువులచే వారల సిరస్సులపైగా నూతనవస్త్రమును బట్టి బ్రాహ్మణులు నాలుగు ప్రక్కలను నిలువబడి మంత్రోచ్చారణలు చేయుచు ఆవస్త్రముపై యక్షతలను వేయుదురు. అప్పటిలో, కన్యావరులిద్దరు గోధాన్యాది లాభములనుగూర్చి మనోసంకల్పము చేయుచుందురు. ఆయక్షతలను బ్రాహ్మణులుదీసి దంపతులిద్దరికి నాశీర్వదించెదరు. తరువాతను పుణ్యాహవాచకము, స్వస్తివచనము, వరుణపూజచేసి పంచభూ సంస్కారములతో హోమము చేయబడును. హోమములో జాతమైన "చరుపాకము"ను(హోమములో వుడికిన బియ్యము) కన్యావరులు భక్షించెదరు. అప్పుడునీళ్లచే పురోహితుడు మార్జనముచేయును. యథాశక్తిని ఫలదానాది దక్షిణలివ్వబడును.

అయిదవ దినము. వరుణపూజ, ఆశీర్వాదము, వసంతోత్సవము జరుగబడును.

ఆరవ దినము. బెద్దిపాడియా. వధూవరులచే కళ్యాణమంటపముపై గవ్వలచేనాడించబడును. తదితరకర్మ జరుగబడును.

ఏడవ దినము. కంకణోద్వాసము, మొండాబిద్ధా.

ఎనిమిదవ దినము. విషదినముగాన వరుడు పెండ్లిగృహము నుండి అలకచేసితరులకు దెలియక వెడలును. ఈదినమంతయు కన్యయొక్క గృహమందు వరుడుండగూడదు.

తొమ్మిదవ దినము. కన్యయొక్క తండ్రియు, సోదరులుమగ లసి ఫలహారాది వస్తువులతోగూడ వెడలి వరునియొక్క యలు కనుదీర్చి తమగృహమునకు వానినితోడ్కొని పోబడును. తరు వాత వధూవరులు గవ్వలచే నాడెదరు.

చంద్రద్వితీయబంధాపన. శుద్ధవిదియసాయంకాలమునభక్ష్యా ది పిండివంటలుచేసిచంద్రుని స్వరూపమొకపీటపై స్థాపనచేసిపూ జయొనరింపబడును. ఈపూజవివాహమైనసంవత్సరమువరకు మా తన చంద్రదర్శనమయిన ప్రతి మాసములోను జరుగబడును.

సంవ్వాత్సరవృద్ధి. వివాహమైనసంవత్సరాంతమున మధుప ర్కములు (పసపుపొత్తులు) మకుటములను ద్వాసనచేయబడును.

గద్య॥ ఇది శ్రీమద్గోపాలకృష్ణ పరబ్రహ్మ కరుణాకటాక్ష లబ్ధ విద్యావైభవ కాత్యాయన సూత్రయాజ్ఞవల్క్యగోత్ర గౌడ బ్రాహ్మణ శిష్టకరణ వంశోద్భవ కుప్పిలి రంగయాఖ్య చతుర్థతన య కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన శ్రీమదుత్కల వి ప్రవంశ ప్రదీపికయను గ్రంథంబునందు చతురాధ్యాయము.

సంపూర్ణము.



# ఉత్కల విప్ర వంశ ప్రదీపిక.

## పంచమాధ్యాయము.

### అథగోత్ర ప్రవర నిర్ణయః

బ్రహ్మఋషి సంతతివారలు బ్రాహ్మణులు.

మూ॥ విశ్వామిత్రో జమదగ్నిర్భరద్వాజోథగోతమః।
అత్రిర్వసిష్టః కశ్యప ఇత్యేతే సప్తఋషయః॥

విశ్వామిత్రుడును, 2. జమదగ్నియును, 3. భరద్వాజుడును, 4. గోతముడును, 5. అత్రియును, 6. వసిష్టుడును, 7. కశ్యపుడును వీరలు సప్తమహాఋషులు.

మూ॥ సప్తానామృషీణామగస్త్యష్టమానాం
యదపత్యం తద్గోత్ర మిత్యాచక్షతే॥

తా॥ అగస్త్యుని ఎనిమిదవ వానిగా కలిగిన ఏడుగురైన ఋషులయొక్క యేదిసంతానమో అదిగోత్రమని చెప్పబడుచున్నది.

మూ॥ ఋషీణాహి దేవాః పురుషమనుబన్ధ్యంత ఇతివిజ్ఞాయతే।
అథాపరం విజ్ఞాయతే ఆర్షేయం ప్రవరమన్వాచష్టే।

తా॥ ఋషులపేర్లు చెప్పుటచేతను దేవతలు యజమానుని

ఋషిసంతానమని తెలిసికొనుచున్నారు. గానఋషిసంబంధమైన ప్రవరమును వరుసగా జెప్పవలయును.

మూ॥ యో వా అన్యస్సన్నథాన్యస్యార్షేయేణ ప్రవృణీతే।
సవా అస్య తద్యచారిష్టం వీతం వృంక్త ఇతివిజ్ఞాయతే॥

తా॥ ఎవడు అన్యగోత్రుడై అన్యునియొక్క ఋషుల పేర్లుచెప్పి వరించుచున్నాడో వీనియొక్క యాగఫలమును, తర్పణాదిఫలమును ఆ అన్యఋషి పొందుచున్నాడని తెలియబడుచున్నది.

మూ॥ పురోహిత ప్రవరో రాజ్ఞాం॥

ప్ర॥ రాజ్ఞాం=క్షత్రియ వైశ్యులకు, పురోహితప్రవరః=పురోహితులయొక్క ప్రవరము చెప్పవలయును.

మూ॥ సపురోహిత ప్రవరాస్త్వేవం న్యాయేన॥

వ్యాఖ్యా॥ క్షత్రియాణాం విశేషః పురోహిత ప్రవరా ఏవతే భవితుమర్హంతి న్యాయేన సర్వేషాం పురోహితస్య విద్యమానత్వాత్ ఆత్మనః కర్మణి అధికారాత్ పురోహిత ప్రధానా ఏవతే భవితు మర్హంతి.

టీ॥ న్యాయేన=విచారించగా, తే=అక్షత్రియులు, సపురోహితప్రవరాః ఏవ=అందరికిని పురోహితుడు ఉంచుచున్నాడుగనుకను, తనకర్మయొక్క అధికారము పురోహితునియందున్నది గనుకను, పురోహిత ప్రవరముచేత వ్యవహరించవలయును.

మూ॥ పురోహితస్య ప్రవరేణ రాజా ప్రవృణీత ఇతివిజ్ఞాయతే॥

వ్యా॥ పురః ఏనం దధాతీతి పురోహితః—క్షత్రియవైశ్యయో ర్వార్హోమికః—అభిజనవిద్యావృత్త సహితః తస్య ప్రవరేణ రా

జాఽభిషిక్తః-ప్రవృణీతే=బ్రాహ్మణోపిరాజ్యం ప్రాప్తః పురోహితప్రవరేణ ప్రవృణీతే॥

టీ॥ రాజా=(అభిషిక్తుడైన)రాజు, పురోహితస్య=పురోహితుని, ప్రవరేణ=ప్రవరచేత,వృణీతే=వరించవలయును, ఇతి=అని, విజ్ఞాయతే= తెలియఁబడుచున్నది. (బ్రాహ్మణుఁడు రాజ్యమును పొందినవాడైతే అతఁడున్ను పురోహితుని ప్రవరతోటి వరించవలయును.

మూ॥ అథాసంప్రజ్ఞాత బంధురాచార్యా

ముపాధ్యాయణామను బ్రవీత॥

టీ॥ అథ=అనంతరము, అసంప్రజ్ఞాత బంధుః=బాగుగఁ దెలియఁబడని ఋషిప్రవరముగల (బ్రాహ్మణుఁడు) ఆచార్యాముపాధ్యాయణః=ఆచార్యుని ప్రవరను, అనుబ్రవీత=వరుసగాఁ జెప్పవలయును. (క్షత్రియవైశ్యులును పురోహితప్రవరమును చెప్పవలయును)

క్షత్రియ వైశ్యులున్ను బాగుగా తెలియబడని ఋషిప్రవరము గలబ్రాహ్మణులు, తమపురోహితునియొక్క ప్రవరముతో వరించవలయునని ఆపస్తంబ ప్రవరకాండములో చెప్పబడియె.

మూ॥ భృగూణాం సవివాహోఽస్తి చతుర్ణామాదితో మిథుః।

శైతాదయ స్త్రియ స్తేషాం వివాహో మిథ ఇష్యతే॥

తా॥ మొదలు నాలుగైన భృగులకు, ఒకరికొకరు పెండ్లి లేదు. శైత్యాదులైన ముగ్గురు వారలకు పెండ్లి ఒకరికొకరు ఇష్టముగా నున్నది.

మూ॥ షణ్ణాం వైగౌతమాదీనాం వివాహో నేష్యతేమిథః।

దీర్ఘతమా ఔచథ్యః కక్షీవాన్ శ్చైక గోత్రజాః॥

తా॥ ఆరుగురైన గౌతమాదులకు పెండ్లి ఒకరికొకరు ఇష్టములే

డుగదా! దీర్ఘతమ అనుఋషి, ఔచథ్యలనుఋషి, కక్షివాన్ అనుఋషియును, ఒకగోత్రమునందు బుట్టినవారలు.

మూ॥ భరద్వాజాగ్నివేశ్యర్షాః శుంగాః శైశిరయః కతాః।
ఏతేనమానగోత్రాః స్యుర్గగాన్ నేకేనదంతి వై॥

తా॥ భరద్వాజ, అగ్నివేశ్య, ఋక్షఅనుఋషులును, శుంగ ఋషియును, శైశిరఋషియును, కతఋషియును, వీరలు ఒక గోత్రముగలవారలుగా అగుచున్నారు. కొందరు సమానగోత్రములుగా చెప్పుచున్నారు.

మూ॥ పృషదశ్వా ముద్గలా విష్ణువృద్ధాః
కణ్వోగస్త్యో హారితస్సంకృతిః కపిః।
యస్కశ్చైషాం మిథఇష్టోవివాహః
సర్వైరస్యైర్జామదగ్న్యాదిభిశ్చ।

తా॥ పృషదశ్వలును, ముద్గములుడును, విష్ణువృద్ధులును, కణ్వుడును, అగస్త్యుడును, హారితుడును, సంకృతియును, కపియును, యస్కుడును, వీరలకు పరస్పరము పెండ్లి ఇష్టము. సమస్తులయిన ఇతరులయినజామదగ్ని మొదలగు వారిచేతవివాహముఇష్టమైనది.

మూ॥ యావన్తోయానగోత్రా స్స్యుర్విశ్వామిత్రోనవర్తతే।
తావద్వసిష్ఠశ్చాత్రిశ్చ కశ్యపశ్చ పృథక్ పృథక్॥

తా॥ ఎంతవరకు విశ్వామిత్రుండు ఉంచున్నాడో, అదివరకువసిష్ఠుండును, అత్రియును, కశ్యపుడును, వేర్వేరుగా ఒకగోత్రముల వారలుఅగుచున్నారు.

మూ॥ ద్వ్యార్షేయాణాం త్ర్యార్షేయ సన్నిపాతే అవివాహః
త్ర్యార్షేయాణాం పంచార్షేయ సన్నిపాతే అవివాహః॥

తా॥ రెండుప్రవరములుగల వారలకు మూడుప్రవరములుగల వారలయొక్క చేరడమునందు వివాహము లేదు. మూడు ప్రవరములుగలవారలకు ఐదుప్రవరములుగల వారలయొక్క చేరడమునందు వివాహము లేదు.

మూ॥ భృగూణాం అంగిరసాంతపసాఁ వ్యర్థ్యం॥

తా॥ భృగ్వంగిరసులు చాలాగొప్పఋషులు వారిసంతతివారలు బాహుళ్యముగా విస్తరించియుండుటచే నాఋషులు ప్రవరలలోవచ్చినను పరస్పర వివాహములు చేసికొనవచ్చును.

మూ॥ ఏకఏవఋషిర్యావత్ ప్రవరేష్వనువర్తతే।
తావత్సమానగోత్రత్వ మన్యత్ర భృగ్వంగిరసాంగణాత్

తా॥ ప్రవరములయందు ఎంతవరకు ఒకేఋషి అనువర్తించుచున్నాడో అంతవరకు భృగ్వంగిరులయొక్క గణముకంటె వేరుచోట సమానగోత్రముగలది.

మూ॥ ఇత్యసమాన ప్రవరైర్వివాహో వివాహః॥

తా॥ గనుక భిన్నప్రవరముగలవారితోగూడ వివాహము చేయవచ్చును.

## 1. యాజ్ఞవల్క్యఋషిః

దేవరాతాష్టకితమనుం తవ్యాలకివాలకి యజ్ఞవల్క్యలాక బృహదగ్ని బభ్రుశాపిని శాలావతిశాలంకాయన శాలబవాః తేషాం

త్ర్యార్షేయః వైశ్వామిత్ర దైవరాతౌ తి॥

తా॥ చికితాః, మనుతంతవః, ఔలకాయః, వాలకాయః, యాజ్ఞవల్క్యః, ఉలూకాః, బృహదగ్నయః, బభ్రవః, శావినయః, శాలవతః, శాలంకాయనాః, కాలబవాః. ఈపేర్లుగలవారు దేవరాతవంశీకులుగాన వైశ్వామిత్ర, దైవరాత, ఔదవ. అనిమూడు ఋషులుగల ప్రవరమును చెప్పవలెను. వీరిప్రధానఋషివిశ్వామిత్రుడు.

యాజ్ఞవల్క్యానాం వైశ్వామిత్ర దైవరాతౌతి, త్ర్యార్షేయ ప్రవరాన్విత యాజ్ఞవల్క్యగోత్రః సామవేదశాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (కృష్ణమూర్తి)శర్మాహంభో అభివాదయే॥ ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. కుప్పిలివారు.
2. ప్రతాపరావువారు.
3. మగడవారు.
4. బొండపిల్లివారు.
5. కొట్టక్కివారు.
6. తట్టికోటవారు.
7. గలావిల్లివారు.

ఈ ఎంతిన్మలలో కొందరు ఉలూకఋషిగోత్రమును చెప్పెదరు. ఔలుక, వాలక, ఉలూక, యాజ్ఞవల్క్య, అనుఋషులు ఒక్కటేగాన యాజ్ఞవల్క్య అనిచెప్పుటయేసరి యైనది.

౨. భరద్వాజఋషిః

భరద్వాజానాం అంగిరస బార్హస్పత్య భారద్వాజేతిత్ర్యార్షే

య ప్రవరాన్విత భారద్వాజగోత్రః సామ వేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (......)శర్మా హంభోఅభివాదయే వీరి ప్రధానఋషులు భరద్వాజ, అంగిరసః ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. పక్కివారు.
2. భోగిలవారు.
3. రాయఘడవారు.
4. మద్దారావువారు.
5. రాజేటివారు.
6. డొంకాడవారు,
7. సింహాద్రివారు.
8. వంతరాంవారు.
9. బెహారావారు.
11. వీరఘట్టపువారు.
12. దధిరావుగారు.
12. కూరాడవారు.
13. కేగిడివారు.
14. మణిపాత్రునివారు.
15. నాగమణివారు.
16. చౌధరివారు
17. కొట్టినవారు.

## 3. శుంగఋషిః.

శుంగానాం అంగిరస బార్హస్పత్య భారద్వాజేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత శుంగగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......)శర్మాహంభోఅభివాదయే.

తా॥ శుంగగోత్రికులు, అంగిరస, బార్హస్పత్య, భారద్వాజ. అనిముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును. ఈగోత్రముగలవారి ప్రధానఋషులు భరద్వాజ, అంగిరసః

ఇంటి పేర్లు.

1. శతమంతరావువారు — 2.

## 4. గౌతమ ఋషిః.

గోతమానాం అంగీరసాయస్య గౌతమేతి త్ర్యార్షేయ ప్రవ రాన్విత గౌతమగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ గౌతమ గోత్రీకులకు అంగిరస, ఆయాస్య, గౌతమఅని ముగ్గురు రుషులుగల ప్రవరమును చెప్పవలయును. వీరిప్రధాన ఋషులు—గౌతమ, అంగిరస ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. కరకవల్సవారు.
2. రొట్టవల్సవారు.
3. వృద్ధహోలువారు.
4. పాత్రునిమహంతివారు.
5. మామిడిపిల్లివారు.

## 5. ఆత్రేయ ఋషిః.

అత్రీణామాత్రే యార్చనాన సస్యావా శ్వేతి త్ర్యార్షేయప్ర వరాన్విత ఆత్రేయగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యా యనిసూత్రః (......)శర్మాహంభోఅభివాదయే॥

తా॥ అత్రిగోత్రముగలవారికి ఆత్రేయ, అర్చనాన, సస్యావా శ్వ అనుముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును. ఈ గోత్రముగలవారి ప్రధానఋషి. అత్రి.

ఇంటి పేర్లు.

వాంద్రంకివారు. 8. కొండవల్సవారు.

ములగవల్సవారు.

## 6. ముద్గలఋషి.

అథాముద్గలానాం ఆంగిరస భార్మ్యాశ్వ మౌద్గల్యేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత మౌద్గల్యగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (......)శర్మాహంభో అభివాదయే.

తా॥ ముద్గలగోత్రికులకు అంగిరస, దర్మ్యాశ్వ, మౌద్గల్య,అని ముగ్గురు ఋషులుగల ప్రవరము అపస్థంభ ప్రవరకాండ ప్రకారము చెప్పుదురు. కొందరు అశ్వలాయన ప్రవరకాండ ననుసరించి

మూ॥ ముద్గలానాం అంగిరస బార్మ్యాశ్వ మౌద్గల్యేతి।
తార్క్ష్యం హైకేప్రవతే తి త్యాంగి
రసంతార్క్ష్యభార్మ్యశ్వ మౌద్గల్యేతి।

తా॥ అంగిరస, భార్మ్యాశ్వ, మౌద్గల్య, అనిముగ్గురుఋషులు గల ప్రవరమును చెప్పుదురు. మరికొందరు అంగిరసపదమును విడచి తార్క్ష్యపదమునుచేర్చి, తార్క్ష్య, భార్మ్యాశ్వ, మౌద్గల్య, అని చెప్పెదరు వీరల ప్రధానఋషి. అంగిరస ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. శేఖరమహాంతివారు. 4. రేగవారు.
2. పంచాదివారు. 5. తామరఖంశివారు.
3. మార్కొండవారు.

## 7. వసిష్ఠఋషిః

మూ॥ వాసిష్ఠేతి వసిష్ఠానాం యేన్య
ఉపమన్యు పరాశరకుండునేభ్యః॥

తా॥ వసిష్ఠగోత్రమువారికి ఉపమన్యు, పరాశర, కుండినఋషులకంటె ఎవరు ఇతరులో వారు వాసిష్ఠ అని ఒకఋషిగోత్రమునుగలవారు. వీరిప్రధానఋషి వసిష్ఠ. ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. సింగుమహంతివారు.

## 8. కుండినఋషిః

అథకుండినానాం త్ర్యార్షేయః। వాసిష్ఠమైత్రావరుణకౌండిన్యేతిప్రవరాన్విత కౌండిన్యసగోత్రః, సామవేదశ్శాఖాధ్యాయీ, శాట్యాయనీసూత్రః(......)శర్మాహంభోఅభివాదయే॥

తా॥ కౌండిన్యగోత్రజులకు వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య, అనిమువ్వురుఋషులయొక్క ప్రవరము చెప్పవలెను. వీరి ప్రధానఋషి. వసిష్ఠ. ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

| | |
|---|---|
| 1. మంత్రివారు. | 3. మురహరిరావువారు. |
| 2. గజగంటరావువారు. | 4. అమరాంవారు. |

## 9. పరాశరఋషిః.

అథ పరాశరాణాం త్ర్యార్షేయః। వాసిష్ఠ శాక్త్య పారాశర్యేతి ప్రవరాన్విత పరాశరగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ

కాత్యాయనీసూత్రః (......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ పరాశరగోత్రీకులకు వాసిష్ఠ, శాక్త్య, పారాశర్య, అని ముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును. వీరి ప్రధానఋషి. వసిష్ఠ. ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. నీలాడివారు. |

## 10. ప్రతీశ్వర ఋషిః.

ప్రతీశ్వరానాం సప్తార్షేయః। మనుమాండవ్య లోహితపురూహుహాపరాశర నైధ్రువప్రతీశ్వరేతి ప్రవరాన్విత ప్రతీశ్వర గోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ ప్రతీశ్వరగోత్రీకులకు మను, మాండవ్య, లోహిత, పురూఋహా, పరాశర, నైధ్రువ, ప్రతీశ్వర, అనిసప్తఋషులుగల ప్రవరమును చెప్పవలెను. వీరి ప్రధానఋషి పరాశర. ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. చక్రధరమహంతివారు. |

## 11. శాండిలఋషిః.

అథశాండిలానాం త్ర్యార్షేయః। దైవలాసితేతి ప్రవరాన్విత శాండిలగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......)శర్మాహంభో అభివాదయే॥

తా॥ శాండిలవంశీకులకు దైవల, అసీత, అనిఇద్దరుఋషులుగల ప్రవరమును చెప్పవలయును.

మూ॥ త్ర్యార్షేయముహై కేకాశ్చప దైవలాసితేతి॥

తా॥ కొంతమంది ముగ్గురుఋషులుగల ప్రవరము చెప్పవలెనని చెప్పెదరు. కాశ్చవ, దైవల, అసీత, అనిప్రవరమును చెప్పవలయును. లేదా

మూ॥ శండిలానాం శాండిలాసితదైవలేతి॥

తా॥ శాండిల, అసిత, దైవల. అనిముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పెదరు. వీరిప్రధానఋషి కశ్యప. వీరి

ఇంటి పేర్లు.

1. ఇప్పిలివారు.
2. బలివాడవారు.
3. అమిటివారు.
4. లోచర్లవారు.
5. నందిగాంవారు.
6. కవిటిభద్రవారు.
7. రావివల్లివారు.

## 12. కశ్యప ఋషిః

కశ్యపానాం కాశ్యపావత్సారాసితేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపగోత్రః సామ వేదశాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః(......)శర్మాహంభో అభివాదయే॥

తా॥ కస్యపగోత్రీకులకు కాశ్యప, అవత్సార, అసిత, అనిముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును. వీరిప్రధానఋషి కశ్యప. ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

| | |
|---|---|
| 1. డబ్బీరువారు. | 5. కోటగంగ్రేడువారు. |
| 2. త్ర్యేడవారు. | 6. ఖస్పావారు. |
| 3. లావేటివారు. | 7. పురుషోత్తమహంతివారు |
| 4. రాజాపురంవారు. | 8. పద్మాపురంవారు. |

## 13. శ్రీవత్సఋషిః.

జామదగ్న్యవత్సాః తేషాంపంచార్షేయో! భార్గవచ్యావనాప్నువానౌర్వ జామదగ్నే త్రిప్రవరాన్విత శ్రీవత్సగోత్రః సామవేద శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః(......) శర్మా హంభో అభివాదయే॥

తా॥ శ్రీవత్సకులోత్పన్నులు, జామదగ్ని సంతానులైఉన్నారు. వీరికి భార్గవ, చ్యావన, అప్నువాన, ఔర్వ, జామదగ్న్య అని పంచఋషులుగల ప్రవరమును చెప్పవలెను. కొందరు భార్గవ, చ్యావన, అప్నువాన, అనిముగ్గురుఋషులుగల ప్రవరమును చెప్పుదురుగానిఅశ్వలాయనఆపస్తంబ ప్రవరకాండలననుసరించిపంచఋషులుగల,ప్రవరమునేచెప్పవలయును. వీరిప్రధానఋషి భార్గవు. ఈగోత్రముగలవారి ఇంటి పేర్లు.

| | |
|---|---|
| 1. రాజపాత్రునివారు. | 5. జొద్దుమహంతివారు. |
| 2. పదాసిపునివారు. | 6. పోలుమహంతివారు. |
| 3. అంపతోంవారు. | 7. పోతుమహంతివారు. |
| 4. నందిగాంవారు. | 8. పోలాకీవారు. |

## 14. అంగిరసఋషిః.

అథాంగిరసానాం త్ర్యార్షేయః ఆంగీరసాయాస్య గౌతమేతి ప్రవరాన్విత ఆంగీరసగోత్రఃసామవేదశ్శాఖాధ్యాయీ. కాత్యాయనీసూత్రః (......)శర్మాహంభోఅభి వాదయే॥

తా॥ అంగిరసగోత్రీకులకు గౌతమ, ఆయాస్య, అంగీరస, అని ముగ్గురు ఋషులుగల ప్రవరము చెప్పవలయును. ఈ ఋషియొక్క సంతతివారు నాగేశ్వర, నగంగీరస, అనివురనామములతో గోత్రములను గూడవాడుకచేయుదురు. గానిఅవిఋషిగోత్రములుగావు. వీరిప్రధానఋషి అంగిరస. ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

| | |
|---|---|
| 1. సౌపడావారు. | 9. పెదపెంకివారు. |
| 2. రఘు పాత్రనివారు. | 10. సంతవురిటివారు. |
| 3. వురిటివారు. | 11. ముక్కవవారు. |
| 4. కంఠిమహాంతివారు. | 12. అనంతపట్నాయకునివారు |
| 5. నాగుమహాంతివారు. | 13. పట్నాయకునివారు. |
| 6. జగ్గుమహాంతివారు. | 14. కల్లైపల్లివారు. |
| 7. నారాణ్ణమహాంతివారు | 15. మడపాంవారు. |
| 8. పాట్నారువారు. | 16. మండవకురిటివారు. |

## 15. కౌసికఋషిః.

చిత్రగాలవకాలబవమనుతన్తు కుసికానాం వైశ్వామిత్ర దైవరాతౌదలేతిత్ర్యార్షేయఃప్రవరాన్వితకౌసికగోత్రః సామవేదశ్శాఖా

ధ్యాయీ కాత్యాయనీసూత్రః(......)శర్మాహంభో అభివాదయే॥

తా॥ చికిత, గాలవ, కాల, బవ, మను, తన్తు, కుసిక, గోత్రములవారికి, వైశ్వామిత్ర, దైవరాత, ఔదల, అనుముగ్గురు ఋషులుగల ప్రవరమునుచెప్పవలయును. వీరిప్రధానరుషి అంగిరస. ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

| | |
|---|---|
| 1. రొల్లుమహంతివారు. | 5. బలరామమహంతివారు |
| 2. కాసిమహంతివారు. | 6. సాలెపాండాంవారు. |
| 3. రాజమహంతివారు. | 7. తోణంగివారు. |
| 4. దుర్గుమహంతివారు. | 8. కోర్లాంవారు. |

## 16. హారిత రుషిః.

అధహారితానాం త్ర్యార్షేయః అంగీరసాంబరీషయావనాశ్వేతి ప్రవరాన్విత హారితగోత్రః సామవేదశాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ హారితగోత్రీకులకు అంగిరస, అంబరీష, యావనాశ్వఅనిముగ్గురు రుషులుగల ప్రవరమును చెప్పవలెను.

మూ॥ మాంధాతారం హైకేచిద్రువతేత త్యాంగిరసం
మాంధాత్రంబరీషయావనాశ్వేతి॥

తా॥ కొందరు అంగిరసపదమును విడచి మాంధాతృపదమును వేసి, మాంధాతృ, అంబరీష, యావనాశ్వ, అనిచెప్పుచున్నారు. వీరిప్రధానరుషి అంగిరస. ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. నరశిపురంవారు. | 2. దామోదర పాత్రునివారు.

## 17. శంఖ రుషిః.

అథశంఖానాం, అంగిరసాంబరీష యౌవనాశ్వేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత శంఖగోత్రః సామవేదశాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ శంఖగోత్రముగలవారికి అంగిరస, అంబరీష, యౌవనాశ్వ, అనుముగ్గురు రుషులుగల ప్రవరమును చెప్పవలెను. వీరి ప్రధానరుషి. అంగిరస. వీరి

ఇంటి పేర్లు.

1 బాడంగివారు. |

ష రా.

ఈ పైనుదహరించిన గోత్రీకులుగాక మరికొన్ని శాఖలవారు నీకళింగదేశంబులో నచ్చటచ్చటగలరు, కొందరు జాతిసంకరమున కొందరు ఆచారలోపమున మరికొందరీ సంఘీకులు లేని దూరపుదేశములకు లౌకికవృత్తిచేబోయి యచ్చట నివసించుటచేతను వేర్వేరుశాఖలుగ విభజింపబడిరి. ఆర్యులీ కళింగదేశమునకు వచ్చిన తరువాత వారిలోకొందరు వణిగ్వ్యాపారములకై మచిలీబందరాది యుతర దక్షిణ ప్రాంతపురేవులకుబోయి యచ్చట

స్థిరవాసులై నానాటికి తూర్పు దేశమునయున్న సంఘముతో సంబంధ బాంధవ్యంబులు విడనాడి ఉత్కల సాంప్రదాయకమును విడచి ఆంధ్రులతో గలసి వారియాచారముల ననుసరించి సంచరించుచుందురు. వీరలుత్కలబ్రాహ్మణ శాఖలోనివారగుటచే శిష్టకరణంబులని పిలునంబడి ద్విజులనబడుదురు. రెండవ కూర్పులో వీరలయొక్క గోత్ర ప్రవరాది విషయంబులు గనుగొని వక్కాణింపబడును.

గద్య॥ ఇది శ్రీమద్గోపాల కృష్ణ పర బ్రహ్మ కరుణా కటాక్ష
లబ్ధ విద్యావైభవ కాత్యాయని సూత్ర యాజ్ఞ వల్క్య
గోత్రగౌడ బ్రాహ్మణ శిష్టకరణ వంశోద్భవ కుప్పిలి
రంగయాఖ్య చతుర్థతనయ నయగుణ విధేయ
కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన
శ్రీమదుత్కల విప్రవంశ ప్రదీపిక
యను గ్రంథంబునందు
పంచమాధ్యాయము
సంపూర్ణం.

కృష్ణార్పణమస్తు.

